# భారతనారీమణులు

నాల్గవ తరగతి.

గ్రంథకర్త్రి:

శ్రీమతి కోకా కృష్ణవేణమ్మగారు,
ప్రెసిడెంటు, డిస్ట్రిక్టు ఎడ్యుకేషనల్ కౌన్సిలు,
తూర్పుగోదావరి జిల్లా.



పబ్లిషర్సు:
వేంకటరామ్ అండ్ కో.,
హెడ్డాఫీసు:-ఏలూరు.

రామాపవర్ ప్రెస్, ఏలూరు.

1929

 (వెల 0—4—0

# FORE-WORD.

The Bharata Narimanulu Series, written by Sreemathi Koka Krishnavenamma Garu, and published by Messrs. **Venkata Ram & Co.,** brings a new field of interest to the pupils reading in Elementary Girls' Schools. The books are written, I believe, for nondetailed study and are written in a style simple enough for the various standards for which they are intended.



The heroines chosen, present different ideals of womanhood, chastity, loyalty, patriotism, and devotion and lead the young to build in themselves "a perfect woman, nobly plan'd to warn, to comfort and to command."

As there are very few books specially intended for Elementary Girls' Schools in the field, I trust this series would receive the approbation of all.

BEZWADA,
17-12-28.

(Sd). **P. Purnamma,**
Sub. Asst. Inspectress, Kistna Girls' Range

# భారతనారీమణులు.

## నాల్గవతరగతి.

---

## 1. సత్యవతి.

గంగానది ఒడ్డున దాశుఁడు అను నొక జాలరి రాజుండెను. అతని చేతిక్రింద చాలమంది జాలరులు ఉండిరి. వారు ప్రతిదినమును చేఁపలను బట్టుకొని తెచ్చుచుండురు. ఒకనాఁడు వారికొక పెద్ద చేఁప దొరకినది. ఆ చేఁపను వారు రాజునకు కానుకగా నిచ్చిరి. దాని కడుపులో నేదియో వె బయయుచుండెను. ఆ రాజు దానిని మెల్లఁగా కోయించెను. అందులో నొక చక్కని బాలికయుండెను. ఆ రాజునకు బిడ్డలు లేరు. అతఁడాపిల్లను తన భార్యకిచ్చెను.

అతని భార్య పిల్లను తీసికొనెను. వేఁడినీళ్ళు పోసి కడిగెను. మంచి నగలనుబెట్టెను. తొట్టిలోఁ బరుండబెట్టెను. చాల ప్రేమతోఁ బెంచెను. బాలికకు సత్యవతిఅను పేరుపెట్టిరి. ఆమె చేఁపకడుపులోనుండి వచ్చుటచేత ఆమెను "మత్స్యగంధి అని పిలుచుచుండిరి. కొంతకాలమునకా బాలిక పెద్దది అయినది. గంగానదిలో బాటసారులను దాటించెడు తెప్ప యున్నది. ఆ తెప్పను నడుపుపని సత్యవతి చేయుచుండెను.

ఒకనాఁడు పరాశరుఁడు అను ముని వచ్చెను. అతఁడు నదిని దాఁటుటకుఁ దెప్పమీఁద ఎక్కెను. సత్యవతి నడుపుచుండెను. పరాశరునకు బాలికయందు ప్రేమకలిగెను. ఆమె శరీరము మంచిగంధపువాసన గలిగియుండునట్లు వరము నిచ్చెను. ముని దయచేత సత్యవతికి నొక కుమారుఁడు కలిగెను. అతనికి వ్యాసుఁడని పేరుపెట్టిరి. వ్యాసుఁడు భగవంతుని అవతారము. అతనికి పుట్టినప్పుడే అన్ని విద్యలును వచ్చియుండెను. అతఁడు తల్లియగు సత్యవతికిఁ బుట్టగానే నమస్కారముచేసి 'అమ్మా! నాతో నీకు అవసరము కలిగినపుడు నన్నుఁ దలఁచుకొనుము. నీకుఁ గనఁబడెదను' అని చెప్పి వెళ్ళిపోయెను.

ఇది అంతయు సత్యవతికి వింతగా నుండెను. ఆమె ఈ సంగతిని ఎవరికిని జెప్పలేదు. రహస్యముగా నుంచెను. ఈమె ఒడలి మంచిగంధపు సువాసన ఒక యోజనము (ఆమడ) దూరమునకు గొట్టుచుండెను. అప్పటినుండియు ఆమె యోజనగంధ యని పిలువఁబడుచుండెను.

ఒకనాఁడు శంతనుఁడను మహారాజు వేఁటకువచ్చెను. ఆయనకు ఎక్కడినుండియో మంచిగంధపు వాసన వేసెను. వాసన యెక్కడిదోయని అటునిటు చూచెను. ఏమియుఁ గనఁబడలేదు. ఆయేటియొడ్డువెంబడి పోయెను. పోగా పోగా సత్యవతి కనఁబడెను. ఆమె పడవ నడుపు చుండెను. శంతనుఁడు ఆమె సమీపమునకుఁ బోయెను. ఆమె అందము

నకు మెచ్చుకొనెను. అప్పుడు ఇరువురు ఈ క్రింది విధముగా మాటలాడిరి.

శంతనుఁడు:—నాతి ! నీవెవ్వతవు ! నీపేరేమి ?

సత్యవతి:—అయ్యా ! నేను దాశరాజు కూఁతురను. సత్యవతి యను దానను. నేను ఈపడవను నడుపుచుందును. మీ రెవరు ?

శంతనుఁడు:—నేను కురురాజ్యమును ఏలువాఁడను. నాపేరు శంతనుఁడు. నాకు నీయందు వలపుగలిగినది. నీవు నన్ను వరించినచో ధన్యుఁడనయ్యెదను.

సత్యవతి:—రాజా ! నేను చిన్నదానను. నాతండ్రియనుమతిని బొందుము.

ఆమాటచెప్పిన తోడనే శంతనుఁడు దాశరాజు ఇంటి కిఁబోయెను. దాశరాజు శంతనునిఁ జాల గౌరవించెను. శంత నుఁడు తన కోరికను వానికిఁ దెల్పెను. "సత్యవతికిఁబుట్టిన వానికి రాజ్యమిత్తువేని నీకు సత్యవతి నిచ్చెద"నని దాశరాజు చెప్పెను. శంతనునకు భీష్ముఁడను కుమారుఁడు గలఁడు. అతఁడు చాల బలముగలవాఁడు. అన్నివిద్యలు నేర్చినవాఁడు. మంచివాఁడు. పితృ భక్తికలవాఁడు. శంతనుఁడు రాజ్యమును భీష్మునికియ్యవలసియుండెను. కావున ఏమియు చెప్పలేక తిరిగి ఇంటికిఁబోయి పరుండెను.

ఈ సంగతి భీష్మునకుఁ దెలిసినది. అతఁడు వెంటనే దాశరాజు కడకుఁ బోయెను. సత్యవతి కొడుకులకు రాజ్య

మిత్తునని చెప్పెను. తాను ఈ జన్మమంతయుఁ బెండ్లి లేకుండ



గడపెదనని ప్రతిజ్ఞ చేసెను. సత్యవతినిఁ దీసికొని వచ్చి తండ్రికిఁ బెండ్లి చేయించెను. శంతనుఁడు చాలసిగ్గుపడెను.

భీష్మునియందుఁ జాల ప్రేమకలిగెను. అతని యిష్టము వచ్చినపుడే మరణమును బొందఁగలుగునట్లు వరమునిచ్చెను.

శంతనుఁడు సత్యవతినిఁ బెండ్లి చేసికొనెను. ఆమెకు ఇద్దఱు కొడుకులు పుట్టిరి. వారిలో నొకఁడు చనిపోయెను. మిగిలినవాఁడు విచిత్రవీర్యుఁడు. ఇతఁడు సమర్థుఁడుకాఁడు. కురురాజ్యమునకు విచిత్రవీర్యుని రాజుచేసెను. తల్లియగు సత్యవతిని, బాలుఁడగు విచిత్రవీర్యుని భీష్ముఁడు కాపాడు చుండెను. అతఁడు తమ్మునకుఁ బెండ్లిచేసెను. విచిత్రవీర్యుఁడు సంతానము లేకుండ చనిపోయెను.

అప్పుడు సత్యవతి వ్యాసునిఁ దలఁచికొనెను. ఆయన ప్రత్యక్షమై 'ఏమి సెలవు' అని యడిగెను. ఆమె కొడుకులు చనిపోయిరని దుఃఖించెను. కులమును ఉద్ధరింపుమని కోరెను. విచిత్రవీర్యున కిద్దఱు భార్యలు. పెద్దది అంబిక. రెండవది అంబాలిక. ఈ యిరువురకుఁ జెరియొక కొడుకు పుట్టునట్లు వ్యాసుఁడు అనుగ్రహించెను. అంబిక కొడుకు ధృతరాష్ట్రుఁడు. అంబాలిక కొడుకు పాండురాజు. వీరిద్దఱు సత్యవతికి మనుమలు. రాజ్యము వీరి వశమైనది. సత్యవతి అడవికిఁబోయి తపస్సు చేసెను. స్వర్గములోఁ దన భర్తను గలిసికొనెను.

# 2. గాంధారి.

సుబలుఁడు అనురాజు ఒకఁడుండెను. ఆయన గాంధార దేశమును పరిపాలించు చుండెను. ఆరాజునకు గాంధారి యను నొక కుమార్తెయుండెను. శకుని అనునతఁడు కొడుకు. గాంధారి మంచి గుణములుగలది. విద్యలన్నియును జక్కఁగాఁ జదువుకొన్నది. చాల అందముగలది. ఆమె నవ్వులాటలలోఁ గూడ బొంకి యెఱుఁగదు. కొంత కాలమున కామెకుఁ బెండ్లియీడు వచ్చెను.

వెనుకటి ప్రకరణమునఁ జెప్పబడిన సత్యవతి మనుమఁడగు ధృతరాష్ట్రుఁడప్పుడు హస్తినాపురమును ఏలుచుండెను. ఆయనకుఁ బెండ్లికాలేదు. పెండ్లికూఁతురు కొరకు బ్రాహ్మణులు తిరుగుచుండిరి. ధృతరాష్ట్రునకుఁ జాల పెద్దరాజ్యము గలదు. అతనికి ధనము చాల ఉండెను. ఆసంగతి సుబలునకుఁ దెలియును. బ్రాహ్మణులు గాంధార దేశమునకు వచ్చిరి. వారిని సుబలుఁడు రావించెను. వారితో ధృతరాష్ట్రునకుఁ దన కూఁతునిచ్చెదనని చెప్పెను. వారు సరే యని చెప్పి వెళ్ళిపోయిరి.

తరువాత ధృతరాష్ట్రుఁడు పుట్టు గ్రుడ్డివాఁడని తెలిసి సుబలుఁడు విచారపడుచుండెను. అతఁడు కూఁతురినిఁ బిలిచెను. "కుమారీ! నిన్ను ధృతరాష్ట్రున కిచ్చెదనని మాటచెప్పి

లేని. అతఁడు గుడ్డివాఁడని తెలిసినది. మాటతప్పుటకు వీలు లేకున్నది. నాకేమియు తోఁచుటలేదు. అని పలికెను. అప్పు డామె తండ్రితో "నాన్నగారూ! అబద్ధము లాడకూడదు. చాల దోసము వచ్చును. మీరు మాటఇచ్చినది మొదలు నాకు ధృతరాష్ట్రుఁడే భర్త. నేనింకొకరినిఁ బెండ్లి చేసికొనను. ధర్మమునకు విరుద్ధముగానడవవద్దు" అని హితోపదేశ మొనర్చెను.

సుబలుఁడు కూఁతురిని దగ్గరకుఁ జేరఁదీసెను. ముద్దా డెను. ఆమె నీతికిఁ జాల మెచ్చుకొనెను. ధృతరాష్ట్రునకు శుభలేఖను బంపెను. పెండ్లివారు తరలివచ్చిరి. పెండ్లి అయి నది. పెండ్లికుమారునకుఁ గన్నులు లేకపోవుట ఒక్కటే లోపము. అతఁడు గొప్ప బలవంతుఁడు, ధనవంతుఁడు, గుణ వంతుఁడు, రూపవంతుఁడు. మఱియే లోపమును లేదు. వారిద్దఱిజోడు చక్కఁగా సరిపోయినది.

గాంధారి పెనిమిటి మొగమువంకఁ గన్నారఁ జూచి నది. మనసులో జాల సంతోషమును బొందినది. భర్త ప్రపంచమును జూడలేడు. అందువలన ఇఁకనుండి నేనును జూడను అని అనుకొనెను. ఆమె కన్నులకు గంతలు కట్టు కొనెను. నాఁడు మొదలు ఆమె ఎవ్వరిమొగమును జూడలేదు. మగనితో అత్తవారింటికిఁబోయెను. ఆమెకు మామ లేఁడు. అత్త యున్నది. ఆమెకును తక్కుంగల పెద్దలకును నమస్కరించినది.

ధృతరాష్ట్రునకుఁ బాండురాజు అను తమ్ముఁడుండెను. ఆయనకుకూడ పెండ్లిచేసిరి. అతనికి భార్యలు ఇద్దఱు. మొదటియామె కుంతీదేవి. రెండవయామె మాద్రి. కొంత కాలమునకు గాంధారి గర్భవతి యయ్యెను. కుంతియును గర్భవతి అయ్యెను. కుంతికి ధర్మరాజు పుట్టెను. గాంధారి ప్రసవముకాలేదు. ఆమెకు మనసులో దుఃఖము కలిగెను. ధర్మరాజునకు రాజ్యమంతయు బోవునని తలఁచినది. పిమ్మట నామె పెద్ద మాంసగోళమును ప్రసవించెను. దానిని నూరు ఖండములుగ జేసిరి. ఒక్కదానికిని బ్రాణములేదు. అందఱును ఏడువసాగిరి. ఇంతలో వ్యాసముని వచ్చెను.

ఆముక్కలను వ్యాసుడు వేఱువేఱుగాఁ బెట్టించెను. వానిపయి మంత్రోదకమును జల్లెను. ఒక్కొక్క శకలము ఒక్కొక్క బాలుఁడయ్యెను. గాంధారికి నూఱుగురు కొడుకు లయిరి. తరువాత నొక కూఁతురు పుట్టినది. ఆమెకొడు కులలోఁ బెద్దవానికి దుర్యోధనుఁడని పేరుపెట్టిరి. రెండవ వానికి దుశ్శాసనుఁడని పేరుపెట్టిరి. నూఱుగురిలో వీరిద్దఱే ముఖ్యులు. తక్కినవారుసామాన్యులు. కూతురుపేరు దుస్సల.

తఱువాతఁ గుంతికి భీముఁడును అర్జునుఁడును బుట్టిరి. మాద్రికి నకులుఁడును సహదేవుఁడును బుట్టిరి. ఇంతలోఁ బాండురాజు చనిపోయెను. గాంధారికొడుకులు నూఱుగురును **కుంతీదేవి పుత్రులగు పాండవులు అయిదుగురును ఒక్క**

చోటనే యుండిరి. ఒక్కచోటనే విద్యలు నేర్చుచుండిరి. ఆ నూర్గురకుఁ గౌరవులని పేరు. ఈ అయిదుగురకుఁ బాండవులని పేరు. కౌరవులకంటెఁ బాండవులు బలవంతులు. విద్యలలోఁ గూడఁ బాండవులే గొప్పవారగుచుండిరి. పాండవులు అబద్ధములాడరు. ధర్మము తప్పి నడువరు.

పెద్దవాడగు ధర్మరాజు రాజగునేమోయని దుర్యోధనునకు సంశయము కలిగినది. వారిని ఎట్లయినను రాజ్యమునుండి వెడలఁగొట్టవలెనని తలఁచెను. అతఁడు బలముచేతఁ బాండవులను జయింపలేఁడు. మాయోపాయములను బన్నుచుండెను. దుర్యోధనుని గాంధారి ఎల్లప్పుడును నీతులు చెప్పుచుండెను. అతఁడు వినలేదు. తల్లికి కనఁబడుటయే మానివేసెను. అతఁడు పాండవులతో మాయజూదమాడెను. వారి రాజ్యమును హరించెను. వారిని అడవులకుఁ బంపెను. వారినిఁ జాలవిధముల వంచించెను. పాండవులు ఓర్పుతో నీతికిఁ గట్టుబడియుండిరి. తుదకు పాండవులు యుద్ధముచేసి కౌరవుల నందఱను జంపిరి. రాజ్యమంతయుఁ బాండవులకే చెందెను.

గాంధారికి ఒక్క కొడుకైనను మిగులలేదు. మిగుల శోకమును బొందెను. కొంతకాలము ధర్మరాజు ఒద్దనే యుండెను. ధర్మరాజు గాంధారీ ధృతరాష్ట్రులను మిక్కిలి గౌరవముతో బూజించెను. చివఱకు గాంధారియు భర్తయు అడవులకుఁ బోయి తపస్సుచేసిరి. పిమ్మట స్వర్గమునకుఁబోయి సుఖముల ననుభవించిరి.

---

# 3. యశోద.



యశోద గొల్లకులములోఁ బుట్టినది. ఈమె పెనిమిటి పేరు నందుఁడు. యశోదకు దేవునియందుఁ జాలభక్తి. ఆమె యెప్పుడును విష్ణుమూర్తిని ధ్యానము చేయుచుండును. విష్ణు కథలను చదువుచుండును. విష్ణుని బూజించుచుండును. నందుఁడు కూడ విష్ణుభక్తుఁడే.

యశోద గర్భవతి అయ్యెను. ఆమెకు ఒక ఆడుపిల్ల పుట్టినది. ప్రసవమైనప్పుడు ఆమెకు ఒడలు తెలియలేదు. ఆసమయముననే దేవకీదేవికి విష్ణుమూర్తి కొడుకై పుట్టెను. దేవకీభర్త వసుదేవుఁడు. అతఁడు తన కొడుకును దీసికొని వచ్చెను. యశోద ప్రక్కలోఁ బరుండఁ బెట్టెను. యశోదకుఁ బుట్టిన కూఁతురినిఁ దీసికొనిపోయి దేవకి ప్రక్కలోఁ బరుండఁ బెట్టెను.

కూఁతురు పుట్టిన సంగతి యశోదకుఁ దెలియదు. వసుదేవుఁడు కొడుకును దెచ్చి పరుండఁ బెట్టిన సంగతియుఁ దెలియదు. అంతవఱకు యశోద ప్రసవమైనట్లు యెవ్వరికినిఁ తెలియనే తెలియదు. అప్పుడు మెలకువ వచ్చెను. ప్రక్కలోఁ బిల్లవాఁడున్నాఁడు. యశోదకుఁ గొడుకుపుట్టినాఁడని అందఱును జెప్పికొనసాగిరి. ఆబిడ్డకుఁ గృష్ణుఁడని పేరు పెట్టిరి.

యశోద ఆకుఱ్ఱవానిని అతి ప్రేమతోఁ బెంచు చుండెను. అతనికి అయిదు ఏండ్ల యీడువచ్చినది. అల్లరి పనులు ఎక్కువగాఁ జేయుచుండెను. అందఱి యిండ్లకుఁ బోయి వెన్న, మీఁగడఁ దినుచుండెను. ఇరుగు పొరుగు ఆఁడువారు వచ్చి మొఱలు పెట్టుకొనుచుండిరి. యశోద వారిని బ్రతిమాలి పంపివేయుచుండెను.



కృష్ణునితో ఆడుకొను పిల్లలు యశోద దగ్గఱకు వచ్చి నీకొడుకు మన్నుతినినాడని చెప్పిరి. ఆమె కృష్ణుని చేతులు గట్టిగాఁ బట్టుకొనెను. మన్ను ఏల తింటివని దండించెను. అతఁడు తినలేదని చెప్పి ఇంకను చూడుమని నోరు తెఱచి చూపించెను. అతని నోటిలో ఎందరో జను లున్నట్టుకనఁబడెను. పర్వతములు కనఁబడెను. సముద్రములు కనఁబడెను. ఏఱ్ఱు కనఁబడెను. యశోద ఇవి యన్నియుఁ జూచినది. ఆమెకు ఆశ్చర్యమైనది. భయము వేసినది. చప్పున వానినోరు మూసెను.

వీఁడు సామాన్యుఁడు కాఁడు. విష్ణుమూర్తియే కృష్ణుఁడై పుట్టియున్నాఁడని అనుకొనెను. తన పూజలు ఫలించిన వని సంతసించెను. లోలోపలఁ జాల మురియుచుండెను. ఇఁక

ఎప్పుడును మన్నుతినవద్దు అని చెప్పి విడిచిపెట్టెను. అతఁడు పరుగెత్తుకొని పోయెను.

మరల అల్లరి పనులు చేయుచుండెను. తోటివారిని కొట్టుచుండెను. వారు వచ్చి కొట్టినాఁడని యశోదతోఁ జెప్పికొనిరి. యశోద కృష్ణుని చేతులు త్రాటితోఁ గట్టెను. ఆత్రాఁడు పెద్ద మానురోటికిఁ గట్టెను. తాను విప్పినదాక కదలవద్దని చెప్పెను. ఆమె ఆవలకు వెళ్ళిపోయెను. కృష్ణుఁడా ఱోలును సులభముగా ఈడ్చుకొని పోయెను. యశోదచూచి వెంటబడెను. బాలుడు గబగబ పరుగెత్తెను. అంత ఱోలు ఎట్లు ఈడ్చుచున్నాఁడమ్మాయని జనులు గుంపులు గూడిరి.



దృష్టి తగులునేమో యని యశోదకు సంశయముకలిగినది. పట్టుకొనుటకుఁ దానుఁ గూడఁ బరుగెత్తెను.

అచ్చట రెండు మద్దిచెట్లున్నవి. అవి దగ్గఱ దగ్గఱగా మొలచినవి. కృష్ణుఁడు ఆచెట్లసందునదూఱెను. అవి పెద్దచెట్లు.

త్రాలు ఆ చెట్లకు పట్టుకొనెను. ఇఁక చిక్కినాఁడని యశోద సంతోషించుచుండెను. ఇప్పుడు పట్టుకోవచ్చు ననుకొనెను. దగ్గఱగాఁ బరుగెత్తెను. కృష్ణుఁడు బలవంతముగా త్రాటిని లాగెను. రెండు చెట్లును క్రిందఁబడిపోయెను. చెట్లు మరల కనఁబడలేదు. ఇద్దరు గంధర్వులు నిలుచుండి యుండిరి. వారు యశోదకు మ్రొక్కిరి. శ్రీకృష్ణునకు మ్రొక్కిరి.

మీరెవ్వరని యశోద వారినడిగెను. "మేము నల కూబర మణిగ్రీవులను గంధర్వులము. శాపముచేత మేము చెట్లమైతిమి. శ్రీకృష్ణుఁడు భగవంతుఁడు. ఆయన పాదము మాకుఁ దగిలినది. అందుచేత మా శాపము పోయినది. మారూపములు మాకు వచ్చినవి. మేము పోవుచున్నాము" అనిచెప్పి మాయమైపోయిరి. యశోద ఏమియు మాటాడ లేకపోయెను. ముక్కుమీఁద వ్రేలుపెట్టుకొని నిలుచుండెను. కృష్ణుడు పకపకనవ్వుచుండెను.

"నాయనా! దగ్గఱకు రమ్ము. త్రాడు విప్పెదను" అని యశోద కృష్ణునిఁబిలిచెను. "కొట్టుటకుఁ బిలుచు చున్నావు. నేనురాను" అని అతఁడు చెప్పెను. "కొట్టను నిజము రమ్ము" అని బ్రతిమాలెను. కృష్ణుఁడు నిలువఁబడెను. ఆమె వాని దగ్గఱకుఁ బోయెను. కట్టువిప్పి బాలునిఁ జంకఁ బెట్టుకొని యింటికిఁ బోయెను.

కృష్ణుఁడు పుట్టినదిమొదలు యశోదకు వేఱుపనిలేదు. అతనికి ఆహారమిచ్చుట, నీళ్ళుపోయుట, అతనిని నిద్రపుచ్చుట అతఁడెచ్చటికేఁ బోయెనో యని వెదకుట, ఈ పనులతో కాల మంతయు సరిపోవు చుండెను.

నందుఁడు మాత్రము పాలము పనులను జూచు కొను చుండెను. శ్రీ కృష్ణునకు యుక్తవయస్సు వచ్చినది. అతఁడు రాచకార్యములందు ప్రవేశించెను. యశోదకు తీరుబడిగా నుండెను. అప్పటినుండియు ఆమె భగవంతుని ధ్యానించు కొనుచుండెను. వ్రతములు సేయుచుండెను. సంతర్పణలు చేయించు చుండెను. భర్తకు ఉపచారములు చేయుచుండెను. పతినే దైవముగా నమ్మియుండెను.



# 4. సావిత్రి.



మద్రదేశమున అశ్వపతి అను రాజుండెను. అతఁడు గుణవంతుఁడు. చాల ధనముగలవాఁడు. అతని భార్యపేరు మాళవి. ఆమె చక్కనిది. మగనిని భక్తితో సేవించుచుండెను. వారికి పిల్లలు లేరు. ఆకాలములో ఏది కావలసియున్నను దేవుని వేడుకొనెడివారు. అశ్వపతి సావిత్రిని ఆరాధించెను. సావిత్రీదేవి అతనికి వరమిచ్చెను. ఒక కూఁతురు పుట్టెను. ఆకూఁతునకు సావిత్రి అని పేరుపెట్టిరి.

సావిత్రిని చాల ప్రేమతోఁ బెంచిరి. ఆమెకు పదునాలుగేండ్ల వయసువచ్చెను. ఆమె శాస్త్రములన్నియును బాగుగా జదివినది. సంగీతము చక్కఁగా పాడఁగలదు. విలువిద్య నేర్చుకున్నది. చిత్రపటములను వ్రాయగలదు. సావిత్రి దేవునియందు భక్తిగలది. దేవుని ప్రార్థింపకుండ ఆమె భుజింపకుండెను.

ఆమె చెలికత్తెలతో కలసి వనమునకు పోవుచుండెను. అచ్చట మంచి మంచి పూలనుగోసి తెచ్చుచుండును. ఆ పూలతో సావిత్రి దేవిని పూజచేసెడిది. ఒక రాజకుమారుఁడు ఆ వనమునకు వచ్చెను. అతఁడు సావిత్రినిఁ జూచెను. సావిత్రియు ఆతనిని జూచినది. సావిత్రియొద్దకు ఆతఁడువచ్చెను. అయ్యా! మీరెవరు అని చెలికత్తెచేత అడిగించెను.

నా పేరు సత్యవంతుఁడు. నాతండ్రి సాళ్వదేశమునకు రాజు. మా రాజ్యమును విరోధులు తీసికొనిరి. మేము ఇప్పుడు అడవిలో ఉన్నాము. దుంపలు తిని బ్రతుకుచున్నాము అని చెప్పెను. అతఁడు చక్కనివాఁడు. అతని అందమునకు సావిత్రి మెచ్చెను. అతనినే పెండ్లి చేసికోఁదలంచెను. ఆమె సిగ్గుచేత ఏమియు మాటలాడలేదు. సత్యవంతుఁడు పేదవాఁడు. ఆమెయందు మనసు తగిలినది. "సావిత్రి పేదవానిని వరించునా" అనుకొనెను. అతఁడు వెళ్ళిపోయెను. సావిత్రి చెలికత్తెలతో ఇంటికిఁబోయెను.

నాఁడు మొదలు అతనిరూపమును సావిత్రి మనసులోఁ బెట్టుకొనెను. అతఁడే తనకు భర్తయని నమ్మియుండెను. ఎవ్వరితోడను అనలేదు. సావిత్రిని ఒకనాఁడు తండ్రి పిలిచెను. ఒడిలోఁ గూర్చుండఁబెట్టుకొని ముద్దులాడెను. "కుమారీ! నీకు పెండ్లి చేయఁదలఁచితిని. నీవు చరిత్రలన్నియుఁ జదివియున్నావు. ఎవరిని వరించెదవో తెలుపుము" అనెను. సావిత్రి తన యిష్టమును దెలుపవలెనని అనుకొనెను. కాని సిగ్గుపడినది. ఇంతలో ఆమెతల్లి అచటికి వచ్చెను.

సావిత్రి లేచి తల్లిదగ్గఱకుఁ బోయెను. ఆమెను కౌఁగిలించుకొనెను. తండ్రి అన్నమాటలను ఆమెతోఁ జెప్పెను. నీవేమంటివి అని తల్లి అడిగెను. "నాన్నగారితోఁ చెప్పుటకు సిగ్గు అయినది. నేనేమియును జెప్పలేదు" అనెను. తల్లి,

పోనిమ్ము నాతోఁ జెప్పుము అనెను. ఆమె వనములో జరిగిన సంగతి తల్లితోఁ జెప్పెను.

మాళవి రాజుకడకు వచ్చెను. కూఁతురు చెప్పిన మాటలను రాజుతోఁ జెప్పెను. ఇంతలో నారదుఁడు వచ్చెను. ఆయన మునీశ్వరుఁడు. అశ్వపతియు మాళవియు వానికి నమస్కరించిరి. నారదుని పీఠముమీఁదఁ గూర్చుండఁబెట్టిరి. రాజు మునితో ఇట్లు చెప్పెను. "మునీంద్రా! నా కూఁతునకు బెండ్లిచేయవలెను. ఆమె సత్యవంతుని వరించినది. అతఁ డెట్టివాఁడో తెలుపవలెను. మీ కెఱుఁగని వారెవ్వరును లేరు" అని కోరెను.

రాజా! అతని నేనెఱుఁగుదును. వాని పేరు చిత్రాశ్వుఁడు. అతఁడు కలలోఁ గూడ బొంకఁడు. అందుచేత సత్యవంతుఁడని పిలిచెదరు. అందమైనవాఁడు. మంచి వంశమునందుఁ బుట్టినవాఁడు. యౌవనుఁడు. అన్నివిధముల మంచి సంబంధమే. వానికి రాజ్యములేదు. పెండ్లి అయిన ఒకసంవత్సరమునకు వానికి మృత్యుగండమున్నది. అది తప్పిన యెడల చాలకాలము బ్రదుక గలఁడు అని నారదుఁడు చెప్పెను.

తండ్రి విచారపడుచుండెను. కూఁతును పిలిచెను. అమ్మాయీ! ఈసంబంధము బాగుగాలేదు. నాకు సంశయముగానున్నదనెను. సావిత్రి తండ్రికి నమస్కరించి "నాన్నగారూ! ఇటువినుఁడు; నేనుసత్యవంతుని వరించితిని. నాకతఁడే

భర్త. మఱొకరిని వరింపుమనుట అధర్మము. మీరు అట్లు చెప్పుట తగదు. అట్టిపని ఉత్తమ స్త్రీలు చేయఁదగినది కాదు. నన్ను సత్యవంతుని కిచ్చి పెండ్లిచేయుఁడు" అని ఖండితముగాఁ జెప్పెను.

అశ్వపతి మాఱు మాటాడలేదు. సత్యవంతుని రావించెను. అతనికిఁ గూఁతురినిచ్చి పెండ్లిచేసెను. ఆమెను మగనితోఁ బంపివేసెను. సావిత్రి నగలన్నియుఁ దీసివేసెను. నారబట్టలు కట్టెను. సత్యవంతునితోఁ గూడి అడవికిఁ బోయెను. అత్తమామలకు నమస్కరించెను. వారు దీవించిరి. ఆమె అత్తమామలకును మగనికిని సేవలు చేయుచుండెను. సావిత్రీదేవిని భక్తితోఁ బూజించుచుండెను. సావిత్రి మాటయందు అందఱకును గౌరవము. ఆమె అక్రమపు మాటలు పలుకదు.

ఆమె దినములను లెక్కపెట్టుచుండెను. పెండ్లిఅయి సంవత్సరము కావచ్చినది. ఇఁక నాలుగు దినములున్నది. ఆమెకు మనసులోఁ దిగులుగా నుండెను. ఆమె అన్నముఁ దినుట మానివేసినది. మంచినీళ్ళయినను త్రాగుటలేదు. ఒక వ్రతము పట్టెను. ఎడతెగకుండ సావిత్రీ పూజ చేయుచుండెను. ఆమె నిష్ఠకు అత్తమామలు మెచ్చిరి. మగఁడు సంతోషించుచుండెను. నాలుగవ దినము వచ్చినది. అదియే కడపటిదినము. ఆమె మనసులో మృత్యుదేవత తాండవమాడుచుండెను.

సత్యవంతుఁడు సమిధలు తెచ్చుటకు బయలుదేఱి అడవికిఁ బోవుచుండెను. సావిత్రి కూడ భర్త నొడంబఱచి



అతని వెంట బయలుదేఱెను. ఇద్దఱును అడవికిఁ బోయిరి.

సత్యవంతుఁడు కన్నులు తిరుగుచున్నవని చెప్పుచుఁ గ్రిందఁ బడెను. సావిత్రి కూర్చుండి మగని తల ఒడిలోఁ బెట్టుకొనెను. ఇంతలో ఆమె కంటికి నల్లని విగ్రహమొకటి కనఁబడెను. భయంకరమూర్తి దున్నపోతునెక్కి వచ్చెను. అతఁడు యమధర్మరాజని ఆమె గ్రహించెను. మెల్లఁగా లేచి నమస్కరించి నిలువఁబడెను.

సావిత్రి:—దేవా! నీ వెవ్వఁడవు?

యముఁడు:—నేను యమధర్మరాజును, నీ పతిప్రాణములను గొనిపోవుటకు వచ్చితిని. అని చెప్పుచు సత్యవంతుని మెడకు పాశమును దగిల్చి ప్రాణములను దీసికొనెను.

సావిత్రి:—నేనును నీవెంట వచ్చెదను. 'నన్నువిడిచి మగనిఁ గొనిపోయిన నూరకుందునా' యని యా సాధ్వి పెనిమిటి మృతకళేబర మొకచో గుప్తపఱచి యముని వెంబడించెను.

యముఁడు:—కుమారీ! నీ పట్టుదలకు మెచ్చితిని. నీమగని ప్రాణములుగాక వేఱొక వరమును వేఁడుము.

సావిత్రి:—చిత్తము. నా అత్తమామలకుఁ గన్నులను దయ చేయుఁడు.

యముఁడు:—సరే! అలాగే ఇచ్చితిని. నేను పోవలయును. నీ వింటికి పొమ్ము.

సావిత్రి:— దేవా! నీవు ధర్మమునకు అధిపతివి. నీ పేరే ధర్మరాజు. నేను సహగమనము చేసినైనను, మగనిఁ జేరవలసిన దాననే. ఇప్పుడు పోవనేల. వెనుకనుండి రానేల? ఇప్పుడు వచ్చుటయే నిజమగు సహగమనము కావున నన్ను వారింపకుము.

యముఁడు:—(తనలో) ఈమె మాటలకు ఉత్తరము సెప్పఁ జాలకున్నాను. (ప్రకాశముగా) అమ్మాయీ! నీపతి భక్తికి సంతసించితిని. నీమగని ప్రాణములు దక్క వేఱొక వరము నడుగుము.

సావిత్రి:—నా అత్తమామల రాజ్యమును వారికి తిరిగివచ్చు నట్లనుగ్రహింపుము.

యముఁడు:—ఇచ్చితిని. ఇఁకఁ బొమ్ము.

సావిత్రి:—ఎక్కడకుఁ బోయెదను? ఆ యమపాశమును నా మెడకుఁగూడఁ దగిలింపుము. సతికి పతిని విడుచుట పాపము. ఇఁక నీవునన్ను పొమ్మని చెప్పఁజాలవు.

యముఁడు:—అబలా! నీ సాధ్వీత్వమునకు మెచ్చితిని. పతి ప్రాణములు దక్క మఱియొక వరమునః కోరుము.

సావిత్రి:—నాతండ్రికి నూఱుగురు కొడుకులను ప్రసాదింపుము.

యముఁడు:—ఇచ్చితిని. ఇప్పటికైనను పొమ్ము.

సావిత్రి:—ఏడు అడుగులు కూడనడచిన స్నేహము కుదురు నని పెద్దలందురు. నేను చాలదూరము మీతోవచ్చి తిని. నాకు చనువు కలిగినది. ఇంక జెప్పుచున్నాను వినుము. మనుష్యులకు మరణముకంటె గొప్ప దండన లేదు. ఎవరికి కోపమువచ్చినను చేసెడు గొప్ప శిక్ష ఇదియే. నేను అందుకు సిద్ధమై వచ్చుచున్నాను. ఇంక నన్నేల పొమ్మనెదరు ?

యముడు:—సావిత్రీ ! నామనసు కరిగినది. నీయిచ్ఛవచ్చిన వరమును వేడుము.

సావిత్రి:—మీరు సత్యవంతులు. నాపతిప్రాణములను దయ చేయుడు.

యముడు:—కుమారీ ! ఇచ్చితిని. నీవునీసంతోషసుఖములను పొందుము. నీకుంజాలమంది బిడ్డలుపుట్టగలరు. నీచరి త్రము భూమిమీద శాశ్వతముగా నుండును. ఇంక పొమ్ము. నేను పోవుచున్నాను.

సావిత్రి పతిశరీరము కడకువచ్చెను. ఇరువురును ఇంటికిబోయిరి. సావిత్రి జరిగినదంతయు అత్తమామల కెఱిం గించెను. సావిత్రిని వారెంతయో ప్రశంసించిరి. ఆమెయు నెప్పటి యట్లు మగనిని అత్తమామలను సేవించుచుండెను.

---

# 5. చంద్రమతి.

ఉశీనరుఁడను రాజుకలఁడు. అతఁడు చేదిదేశమును బరిపాలించెను. ఆయనకొక కూఁతురు గలదు. ఆమెపేరు చంద్రమతి. చంద్రమతి చిన్నతనమునుండియు అబద్ధమాడి యెఱుఁగదు. తల్లిదండ్రులు ఆమెను గారాబముతోఁ బెంచిరి. కష్టమనుమాటయే యెఱుఁగదు. కూఁతునకుఁ బెండ్లి యీడు వచ్చినది. ఉశీనరుఁడు తగిన సంబంధము కొఱకు వెదకుచుండెను.

అప్పుడు అయోధ్యకు రాజు త్రిశంకుఁడు. ఆయనకు హరిశ్చంద్రుఁడను కుమారుఁడుండెను. హరిశ్చంద్రుఁడు అబద్ధమాడనివాఁడు. అధర్మకార్యములఁ జేయఁడు. చాల బలము కలవాఁడు. అతనికిఁ బదునెనిమిది సంవత్సరముల వయస్సు వచ్చెను. రాజ్యమును అతనికి ఇచ్చి త్రిశంకుఁడు తపస్సునకుఁ బోయెను.

ఉశీనరుఁడు చంద్రమతిని హరిశ్చంద్రున కిచ్చెను. ఆ యిద్దఱును అనుకూలముగఁ గాపురము చేయుచుండిరి. వారికొక కుమారుఁడు పుట్టెను. ఆ బాలునకు లోహితాస్యుఁడని పేరుపెట్టెను. హరిశ్చంద్రుఁడు న్యాయముగ రాజ్యము నేలుచుండెను. చంద్రమతి ఆయనకు సహాయముగ నుండెను.

ఆ దినములలో దేవలోకమున మునుల సభ జరిగినది. అచ్చట 'నిజము తప్పనివాఁడెవఁడేని కలఁడా' అని ప్రశ్న కలిగెను. హరిశ్చంద్రుఁడున్నాఁడని వసిష్ఠముని చెప్పెను. అది నిజము కాదని విశ్వామిత్రుఁ డనెను. మునులిద్దఱకును పంతము వచ్చినది. విశ్వామిత్రుఁడు హరిశ్చంద్రునిచేత అబద్ధమాడింతుననియు లేకున్న తన తపస్సులో సగము వసిష్ఠునకు ధారవోతుననియు శపథము పట్టెను.

విశ్వామిత్రుఁడు హరిశ్చంద్రుని యొద్దకు వచ్చెను. "నేను యాగము చేసెదను. దానికి ఏనుఁగు ఎత్తు ధనపురాసి కావలెను. ఆధనమును నీవు నాకు ఇమ్ము" అని హరిశ్చంద్రుని అడిగెను. అతఁడు ఇచ్చెదనని వాగ్దత్తమొనర్చెను. 'కావలసినప్పుడు తీసికొని పోయెదను' అని విశ్వామిత్రుఁడు చెప్పి వెడలిపోయెను.

తరువాత మాయలుపన్ని హరిశ్చంద్రుని రాజ్యమును విశ్వామిత్రుఁడు హరించెను. హరిశ్చంద్రుఁడు, చంద్రమతి, లోహితాస్యుఁడు, అడవులకుఁ బోవలసి వచ్చెను. వారు అయోధ్యను విడిచి పోవుచుండిరి. అప్పుడు యాగమున కిచ్చెదనన్న ధన మిమ్మని ముని అడిగెను. 'నెలదినములు గడువు ఇమ్ము డబ్బును ఇచ్చెదను' అని రాజు కోరెను. ముని గడు విచ్చి తీర్చుమనెను. తన శిష్యుని వారివెంటఁ బంపెను. అతని పేరు నక్షత్రకుఁడు.

అడవిలో ముండ్లు, సన్నతాళ్లు ఉండెను. దారి సరిగా లేదు. నడుచుట కష్టముగా నుండెను. కుమారుని చంద్రమతి ఎత్తుకొనెను. నక్షత్రకుఁడు నడువలేనని కూలఁబడెను. వానిని రాజు ఎత్తుకొనెను. అడవులలోఁ జాలకష్టములు పడిరి. భార్య పడుపాట్లు చూచి హరిశ్చంద్రుఁడు దుఃఖించెను. చంద్రమతి కష్టపడనట్లు నటించుచుండెను. రాజునకు ధైర్యపుమాటలను జెప్పుచుండెను.

మెల్లగా వారు కాశీపట్టణము చేరిరి. ధనమునిచ్చు గడువు దగ్గఱకు వచ్చెను. నక్షత్రకుఁడు తొందర చేసెను. భార్య వేడికోలుపై విధిలేక చంద్రమతిని అమ్మివేసి ముని ఋణము తీర్చెను. "ఇచ్చినధనము బత్తెముక్రింద సరిపోయినది. ఇంకను అసలు అప్పుతీర్చవలెను" అని నక్షత్రకుఁడనెను. రాజు తానుఁగూడ నొక మాలవానికి అమ్ముడు పోయెను. భార్యను కొన్నవాఁడు కాలకౌశికుఁడు. రాజునుకొన్నవాఁడు కాటికాపరి. ఎట్టులో మునియొక్క ఋణము తీఱెను.

కాలకౌశికునకు ఒక భార్యకలదు. ఆమెపేరు కలహకంఠి. ఆమె చంద్రమతిని చాల సాధించుచుండెను. చీఁపురు దెబ్బలు కొట్టుచుండెను. లోహితాస్యునిఁ గొట్టుచుండెను. ఒకనాఁడు లోహితాస్యుని అడవికి ఆకులు తెమ్మని పంపెను. అచ్చటనతఁడు పాముకఱచి మృతుఁడయ్యెను. చంద్రమతి కీవార్త తెలిసినది. చాల దుఃఖించి బాలుని

కగ్నిసంస్కారముచేసి వచ్చెదనని కలహకంఠిని అడిగెను. పనియంతయు ముగించి పిమ్మట తన కాళ్లుపిసికి పొమ్మనెను. ఆమె అట్లంతయుచేసి తరువాత అడవికి వెళ్లెను. శవమును ఎత్తికొని కాటికిఁబోయెను. చితిపేర్చెను. పన్ను ఇయ్యవలసి యుండెను. డబ్బులేదు. అప్పుడు కాటికాపరి హరిశ్చంద్రుఁడే.



మాలవేషముతో ఉండెను. అతఁడువచ్చి శవమును దీసి. అవతలబెట్టి పన్ను ఇచ్చినఁగాని తగులబెట్ట నియ్యననెను.

చంద్రమతికి మితిలేని దుఃఖమువచ్చినది. ఆపుక్కొనెను. పిమ్మట భార్యాభర్త లొకరినొకరు గుర్తించిరి. ఇద్దఱును కలసి చాల విచారించిరి. పన్ను పుచ్చుకొనక బాలునకు దహనసంస్కారము చేయనిచ్చుట ధర్మముకాదనియు, కలహా కంఠినడిగి తెమ్మనియు భార్యను పరిపివేసెను. అడిగి తెచ్చెద నని పోయెను. దారిలో రాజభటులు పట్టుకొనిరి. ఆమెమీఁద దొంగతనమును మోపిరి. రాజు కోపగించి ఆమెకు మరణ శిక్ష వేసెను. చంద్రమతిని రాజభటులు తలారియొద్దకుఁ దీసికొనిపోయిరి. ఆమె కంఠమును నఱుకుమని తలారి హరిశ్చంద్రునితోఁ జెప్పెను. హరిశ్చంద్రుఁడు చాల దుఃఖించెను.

కొడుకు చచ్చెను. భార్యను జంపవలసి వచ్చెను. ఇంతకంటె దుఃఖ మేముండును? హరిశ్చంద్రుఁడు కత్తి నెత్తెను. చంద్రమతి కంఠముమీఁద దెబ్బ వేసెను. కొంచె మైనను దెగలేదు. మఱల వేసెను. తెగలేదు. అతనికిఁ బౌరుషము వచ్చెను. "నేనే సత్యము తప్పనివాఁడనగుదు నేని ఈసారి తెగుఁగాక" అని కత్తినెత్తెను. ఆకత్తిని విశ్వామిత్రుఁడు వెనుకనుండి పట్టుకొని ఆపెను. హరిశ్చంద్రునకుఁ గోపము వచ్చినది. విశ్వామిత్రుని ఆవలకుఁ ద్రోసివేసి మఱల కత్తినెత్తెను.

ఇంతలోఁ బార్వతీ పరమేశ్వరులు ప్రత్యక్షమైరి. ఇది అంతయును విశ్వామిత్రుని మాయ అని వారు చెప్పిరి. లోహితాస్యుని బ్రదికించిరి. చంద్రమతి ఓర్పునకును బాతి వ్రత్యమునకును మెచ్చుకొనిరి. హరిశ్చంద్రుని సత్యవ్రతమును బొగడిరి.

విశ్వామిత్రుఁడు హరిశ్చంద్రునిఁ గౌఁగిలించుకొనెను. "రాజా! నీసత్యమును బరీక్షించితిని. నేనే పందెమును ఓడితిని. నాతపస్సు నీకు ధారవోయుచున్నాను" అని యిచ్చివేసెను. పార్వతీ పరమేశ్వరులు వారిని దీవించిరి. విశ్వామిత్రుఁడు రాజ్యమును ఇచ్చివేసెను. చంద్రమతి పతికి నమస్కరించి సుతుని ఎత్తుకొని ముద్దాడి, రాజుతో అయోధ్యకుఁ బోయెను.

---

# 6. అరుంధతి.

మతంగుఁడు ఒక మహాముని. ఈయన పంచముఁడని ప్రసిద్ధిగఁ జెప్పుదురు. అరుంధతి ఈయన కుమార్తె, ఆమె మిగుల అందగత్తె, బాగుగా చదువుకొన్నది, చాలశాంతము గలది. తండ్రిగారికి భక్తితో సేవలు చేయుచుండెను. ఎక్కువ వయసు వచ్చువఱకు ఆమెకుఁ బెండ్లి కాలేదు.

చిన్నతనములోనే ఆమెకు తపస్సు చేయుట అలవాటయినది. ఇంతనిష్ఠలోనుండు అరుంధతిని బెండ్లి చేసికొనుటకు

అందరకు భయముగానుండెను. తనను వరించినవాఁడు నపుంసకుఁ డగునట్లుగా వరమును బొందెను. అందుచేత నామెకుఁ బెండ్లి సంబంధమే రాలేదు.

ఋషులలో వసిష్ఠుఁడు చాల గొప్పవాఁడు. ఈయన బ్రహ్మదేవుని కుమారుఁడు. ఈయన సూర్యవంశపు రాజులకు గురువు. వసిష్ఠుఁడు తీర్థయాత్రలు సేవించుటకు బయలుదేరెను. పుణ్యస్థలములన్నియుఁ జూచెను. నదులన్నిటిలోను స్నానముచేసెను. అన్ని దేవళములలోను బూజలుచేసెను. అతఁడు మతంగుని ఆశ్రమము ప్రక్కగాఁ బోవుచుండెను.

అరుంధతి వసిష్ఠుని జూచెను. ఆయన అందముగలవాఁడుగా ఆమె కంటికిఁ గనబడెను. ఆయనను బెండ్లాడవలెనని తలంచెను. వసిష్ఠునిఁ దీసికొనిరమ్మని తండ్రితో చెప్పెను. ఈమెకు కన్నెచెఱ విడిపించుట మంచిదని తండ్రినిశ్చయించుకొనెను. ఆమె కోరినవారికే యిచ్చుట క్షేమమని తలంచెను.

వసిష్ఠుఁడు కొంతదూరముదాటి పోయెను. 'అమ్మాయీ అరుంధతీ! నీవే పరుగెత్తుకొని పోయి మునిని దీసికొనిరమ్మ' అని తండ్రి ఆజ్ఞాపించెను. ఆమె ఆవిధ్వనఁ బరుగెత్తుకొని పోయెను. మునినిగలిసికొనెను. అతనిపాదములకు మ్రొక్కెను. "అబలా! త్వరలో బెండ్లికూతుర వగుదువుగాక! అమ్మా, ఏమిపనిమీఁద వచ్చితివో చెప్పుము అనెను. ఆమె నిలుచుండెను. స్వామీ! నేను మాతంగుని కూఁతురను, నాపేరు

అరుంధతి, ఇదియే మాతంగఋషిగారి ఆశ్రమము. మీరు రావలెనని కోరుచున్నాను" అనెను.

'సెబాసు! ఇది మాతంగముని ఆశ్రమమా! పొరబాటున నెగిలివచ్చితిని. రమ్ము పోదము' అని వెనుకకు మరలి వచ్చెను. మాతంగుఁడు లేచి మునికి నమస్కరించెను. అయ్యా! మీరువచ్చుటచేత నాయిల్లు పవిత్రమైనది. నాజన్మము పావనమైనది. ఈ దినమున నాయింటనే ఉండవలెను. మాతో భోజనము చేయవలెను. అని కోరెను. వసిష్ఠుఁ డొప్పుకొనెను.

మునులిద్దఱును గలిసి స్నానమునకుఁ బోయిరి. అనుస్థానములను దీర్చుకొనుచుండిరి. అరుంధతి ఇంతలో వంటలను బూర్తిచేసెను. మునులు వచ్చిరి. ఇష్ట పదార్థములను దిని తృప్తిఁజెందిరి. చెట్లనీడను గూర్చుండి యుండిరి. ఆ సమయములో అరుంధతి వచ్చెను. మతంగుఁడా కన్యను వసిష్ఠునకు సమర్పించెను. "ఈమె నీకు భార్యగా నుండఁగలదు. ఆమెయే స్వయముగా మిమ్ము వరించినది. మీరు తప్పక అంగీకరించవలెను" అని వేఁడికొనెను.

వసిష్ఠు మనసులోఁ జాల సంతోషించెను. ఆమె పాణిగ్రహణముచేసెను. అరుంధతి మెడలో మంగళసూత్రమును గట్టెను. క్రొత్త దంపతులు ఒకరినొకరు ప్రేమించిరి. మతంగునియొద్ద సెలవు పుచ్చుకొనిరి. ఇద్దఱును దమ ఆశ్రమమునకు వచ్చిరి. సంసారమును చేయుచుండిరి.

అరుంధతి పతి కనుసన్నల మెలఁగుచుండెను. అతనికి మెప్పు కలుగునట్లు ఉపచారములు చేయుచుండెను. ప్రతి దినమును పతికంటె ముందుగా లేచును. స్నానముచేసి మడి కట్టుకొనును. పూజలకుఁ గావలసిన పువ్వులు, పత్రి, గంధము, అక్షతలు సిద్ధముచేయును. పతికి మడుగుపంచెను ఆరవేయును. పీటమును అమర్చును. కలశముతో ఉదకము బెట్టును. ఆయన జపము పూర్తియగుసరికి వంటకము చేయును. ఆయన లేచుసరికి వడ్డించును. ఆయన తినిన వెనుక తాను తినును. లేచి పతికి పదములొత్తును. ఆయన బయటకుఁబోయిన నప్పుడు ఆశ్రమములోని చెట్లకు నీళ్ళు పోయును. దోహనములు చేయును. ఇట్లు జాగ్రతతో జరుపుకొనుచుండెను.

వసిష్ఠునకు ఆమెపై చాల దయవచ్చెను. ప్రేమ హెచ్చెను. స్నేహము అతిశయించెను. అనురాగముతోఁ గాలముపుచ్చుచుండిరి. ఇట్లు చిరకాలము జరిగెను. వారికి నూఱుగురు పుత్రులు పుట్టిరి. విశ్వామిత్రునకును వసిష్ఠునకును వైరము. విశ్వామిత్రుఁడు ముక్కోపి. అతఁడు ఈ నూఱుగురు కొమరులను జంపించెను. వసిష్ఠుఁడు పుత్రశోకము పట్టఁజాలక చావవలెనని యత్నించెను. కొండలమీఁదికెక్కి క్రిందికి పడెను. ఏమిచేసినను చావు రాలేదు.

అరుంధతి మనస్సుమాత్రము నిశ్చలముగ నుండెను. ఆమెయే పతిని ఓదార్చెను. వైరాగ్యమును జ్ఞప్తికిఁదెచ్చెను.

దుఃఖము నుండి మరల్చెను. ఎప్పటియట్ల కాలము గడుపుచుండిరి. వారికిఁ బ్రపంచ సుఖములతోఁ బనిలేకుండెను. ముక్తిమార్గమునకుఁ బాటుపడుచుండిరి.

---

# 7. కౌసల్య.

భరతవర్షమునఁ గోసలము అను దేశము కలదు. ఆ దేశపు రాజునకుఁ గౌసల్య అను కూఁతురుండెను. ఆమె చాల శాంతము కలది. సుందరమైనది. ఆమె చెలికత్తెలతోఁ గూడి ఆటలాడుచుండును. బొమ్మల పెండ్లిండ్లు చేయుచుండును. ఉద్యానవనములలో అనేక రకముల పూలచెట్లను వేయించి వానిని శ్రద్ధతోఁ బెంచుచుండెడిది. ప్రతిదినము తల్లులతోఁ బూలు కోయుచుండును. ఆపూలతో దేవునిఁ బూజించుచుండును. గురువులయొద్ద చదువు నేర్చుకొనుచుండును. గురువు చెప్పిన నీతుల ప్రకారము నడుచుకొనుచుండును. ఆమెకు పెండ్లివయసు వచ్చినది.

సంబంధము కొఱకు ఆమెతండ్రి చాల విచారించెను. అజమహారాజునకు దశరథుఁడను కుమారుఁడుండెను. అతఁడు చాల బుద్ధిమంతుఁడు. గొప్ప పరాక్రమము గలవాఁడు. విలువిద్యలో నిపుణుఁడు. అయోధ్యకు ప్రభువు. సూర్యవంశపు రాజు. అన్నివిధముల యోగ్యుఁడు. ఈ కౌసల్యను దశరథునకిచ్చి పెండ్లిచేసిరి. కౌసల్య పట్టపుదేవి అయ్యెను.

ఎంతకాలము చూచినను ఆమెకు సంతానము కలుగ లేదు. అతఁడు మఱియిద్దఱు కన్యలను పెండ్లాడెను. వారు సుమిత్రయు, కైకయు. వారికిని బిడ్డలు పుట్టలేదు. దశరథు నకు బిడ్డలులేరను చింత ఎక్కువయినది. అనేక వ్రతములు చేసెను. అనేక దానములు చేసెను. చాల మ్రొక్కులు మ్రొక్కెను. భార్యలచేతఁ బ్రదక్షిణములు చేయించెను. ఏమి చేసినను సంతానము కలుగలేదు.

కులగురువగు వసిష్ఠుని పిలిచెను. ఇంకను గొప్పవారగు మునులను పిలిపించి సభగావించెను. జ్యోతిష్కులు వచ్చిరి. నీకు సంతానయోగమున్నదని చెప్పిరి. మునులు పుత్రకామేష్టి యాగమునుఁ జేయుమనిరి. దశరథుఁడు యాగమునకుఁ దల పెట్టెను. మంత్రులు వస్తుసంభారములను తెప్పించిరి. పురో హితులు యాగశాలను కట్టించిరి. దశరథుఁడు యజ్ఞమును పూర్తిచేసెను. యజ్ఞపురుషుఁడు కొంత పాయసమునిచ్చెను.

దశరథుఁడా పాయసమును పుచ్చుకొని సగము కౌసల్య కిచ్చెను. మిగిలిన దానిలో సగము సుమిత్రకిచ్చెను. తక్కిన దానిలో సగము కైకకిచ్చెను. మిగిలియున్నది మరల సుమిత్ర కిచ్చెను. ముగ్గురు భార్యలును గర్భవతులయిరి. కౌసల్య శ్రీరాముని గనెను. కైక భరతుని గనెను. సుమిత్ర లక్ష్మణ శత్రుఘ్నులను గనెను.

శ్రీరాముఁడు నీలి వర్ణము గలవాఁడు. సొగసయిన బాలుఁడు. ముద్దులుగారుచుండు మొగముగలవాఁడు. ఆ బాలుని ఒక్క నిముషమైన విడువకుండఁ దల్లి పెంచుకొనుచుండెను. ఆ బాలునిఁ జూచుటకుఁ జాలమంది ముత్తైదువులు వచ్చుచుండిరి. పెద్దలు వచ్చుచుండిరి. మునులు వచ్చుచుండిరి. అందఱును వచ్చి ముద్దాడి పోవుచుండిరి. సాయంకాలము కాఁగానే తల్లి దిష్టిదృష్టి తీసివేసి గడపలముందఱఁ బెట్టుచుండెను.

ఒకనాఁడు రాముఁడు పోరుపట్టి యేడువసాఁగెను. ఎంత ఓదార్చినను ఊరకొనలేదు. భూతవైద్యులను, రాజ



వైద్యులనుఁ బిలిచిరి. వారేమి చేసినను ఊరకొనలేదు. ఆకసమువంక చేతులుచాచి యేడ్చుచుండెను. చివరకు మంత్రి

వచ్చి చూచెను. అతఁడు చందమామ కొఱకు ఏడ్చుచున్నాడని గ్రహించెను. ఒక అద్దమును దెప్పించి అద్దములోఁ జంద్రుని ప్రతిబింబమును బాలునకుఁ జూపెను. బాలుఁడా యద్దమును చేతఁబట్టుకొని చందమామను చూచుకొనుచుండెను. కౌసల్య కొమరుని పట్టుదలకు సంతోషించెను. కోరిన వస్తువు నందుఁగల దీక్షకు ఆశ్చర్యమొందెను.

తరువాత శ్రీరాముని విశ్వామిత్రుఁడు యాగరక్షణమునకుఁ దీసికొనిపోయెను. లక్ష్మణుఁడు కూడ నతనితో వెళ్ళెను. కొంతకాలమునకు శ్రీరామునికిఁ పెండ్లి అయ్యెను. కౌసల్య కోడలు సీత, ఆమె కొడుకును కోడలిని కన్నులలోఁ బెట్టుకొని పెంచుచుండెను. సీత ఎల్లప్పుడును అత్తయగు కౌసల్యకు సేవచేయుచుండెను.

ఇట్లుండఁగా శ్రీరామునకు పట్టాభిషేకమని దశరథుఁడు ప్రకటించెను. ఊరంతయు అలంకారము చేయఁబడెను. ఈసంగతి మందర అను దాసి చూచెను. కైకకు తంపులు పెట్టెను. ఆమె పట్టాభిషేకమునకు విఘ్నము చేయదలంచెను. శ్రీరాముఁడు తల్లిదగ్గఱకు వచ్చెను. ఆమెకు నమస్కారముచేసెను. నాయనా! పట్టాభిషేకమా నీకు! చాల సంతోషమైనది. ప్రజలను న్యాయదృష్టితో నేలుము. ప్రజలు ఏపాపము చేసినను రాజునకుఁ జుట్టుకొనును. ధర్మము కొఱకు రాజు వేయి కన్నుల కనిపెట్టవలెను. నీవు సుఖముగ నుండుటయే మాకు

సుఖము. నీవు కీర్తిని సంపాదించుకొనుటయే మాకు కీర్తి. అన్ని విధముల నీవే నాకాధారము అని, దీవించి పంపెను.

కైకభరతునకు రాజ్యమిమ్మని దశరథుని కోరెను. రాముని అడవికిఁ బంపుమనెను. దశరథుఁడు ఆజ్ఞ చేయక తప్పినది కాదు. కొంతసేపటికి శ్రీరాముఁడు సీత లక్ష్మణుఁడు అడవులకుఁ బోవుచున్నారని కౌసల్యకుఁ దెలిసినది ఆమె చాలదుఃఖమునొందెను. వసిష్ఠుఁడువచ్చి రామునిఅవతారమును గూర్చి కౌసల్యకు బోధించెను. ఆమె దుఃఖము కొంత శాంతించినది. ఆమె శ్రీరామునిఁ బిలిచెను. అతనిచేతికి రక్ష గట్టిపంపెను. శ్రీరాముఁడు అడవికిఁబోయెను.

దశరథుఁడు రాముని విడిచిన దుఃఖముచే మరణించెను. కౌసల్య అతనితో సహగమనము చేసెను.

## 8. లోపాముద్ర.

లోపాముద్ర విదర్భరాజు కూతురు. ఆమె చాల చక్కనిది. అన్నివిద్యలలోను గొప్ప పండితురాలు. మిగుల బుద్ధిమంతురాలు. పురాణములన్నియును జదివినది. దేశచరిత్రములన్నియుఁ దెలిసికొనినది. యౌవనవతియై యుండెను. ఆమెనిచ్చి పెండ్లిచేయుటకుఁ దగిన వరుఁడు దొరుకలేదు. తండ్రి మంత్రులను బురోహితులను దేశదేశములు ద్రిప్పుచుండెను.

రాజకుమారుల ఛాయా పటములను దెప్పించెను. ఒక్కరును అతనికి నచ్చలేదు. ఏదియో ఒకలోపము కనబడుచునే యుండెను. అతఁడేమియుఁ దోఁచక విచారపడుచుండెను.

ఇట్లుండ నొకనాఁడు అగస్త్యుఁడను ముని విదర్భరాజు కడకువచ్చెను. రాజు మునికి కాలుచేతులకు నీరములిచ్చి పీఠముపయిఁ గూర్చుండఁబెట్టి నమస్కరించెను. చాలవిధముల గౌరవించెను. వచ్చినపని సెలవిమ్మని అడిగెను.

"రాజా! నేను బ్రహ్మచారిని. నాకు నాపితృదేవతలు గనఁబడినారు. నేను పెండ్లిచేసికొని పుత్రవంతుఁడను కాకున్న వారికి సద్గతులు చెడిపోఁగలవట. ఆధర్మశాస్త్రములు నీకు తెలిసినవే. నేను ఇప్పుడు పెండ్లిచేసికొనఁ దలచితిని. నీవు నాకు ఉపకారము చేయవలెను" అని చెప్పెను. రాజు విని విని మీకునేనేమి చేయవలయునో చెప్పుఁడు అనెను. "నీకులోపాముద్ర అను కూఁతురున్నది. ఆమె బుద్ధిమంతురాలు అని విన్నాను. ఆమెను నాకిచ్చి పెండ్లిచేయవలెనని చెప్పెను.

ఆ మాటలు వినఁగానే రాజునకు ఒడలు భగ్గున మండెను. కోపమును దిగమ్రింగెను. మునికి సమాధానము చెప్పకుండ లోనికిఁబోయెను. తన ముద్దుల కూఁతును బిలిచెను. ఆమెను ఒడిలో గూర్చుండఁ బెట్టుకొనెను. ముని చెప్పిన మాటలన్నియు ఆమెతో చెప్పెను. "కుమారీ! చూచితివా! ఈ బడుగుముని ఏనికి అరువదవయేటఁ బెండ్లి కావలయునట.

అంతున నీవే కావలయునఁట. తెల్లగడ్డము, జడలు, సొరకాయ చెంబు, దుంపలతిండి, అడవి నివాసము, ముక్కు మూసికొను వృత్తి, బాపనకులము బళీ! వీనికి నిన్నిమ్మనుటకు నోరెట్లు వచ్చెనో యని తోఁచినది. కోపము వచ్చినది. వాని మొగ మును జూచుటకు ఇష్టములేకపోయినది. ఏమియును అనలేదు. కాని చివాలున లేచివచ్చినాఁడను'' అని రాజు కూఁతురితోఁ జెప్పెను.

నాన్నగారూ? ఎంతతప్పుపని చేసితిరి! ఆ ముని సంగతి మీకు తెలియదు కాఁబోలును. అతనిచరిత్రను నేను బాగుగాఁ జదివితిని. అతఁడు చాల గొప్పవాఁడు. మునులలో అంతటివాఁడులేఁడు. అతఁడు కోపదృష్టితో కన్నుదెఱచిన లోకమంతయు బూడిద కాఁగలదు. ఇంద్రద్యుమ్నుని ఏనుఁ గయిపుట్టునట్లు శాపమిచ్చెను. సముద్రములోని నీరంతయు బుడిసిటఁబట్టి గుటుకున మ్రింగెను. వింధ్యపర్వతమును వంచి దాని పొగరణచెను. వాతాపి అను రాకుసుని మ్రింగి జీర్ణము చేసికొనెను. అతఁడలిగిన మన మందఱమును మాసిపోవుదుము. నీయంతట నీవే బిడ్డనీయవలసినది. ఆ మహనీయుఁడు అడిగిననుగూడ నీవు సంశయించు చున్నావు. తండ్రీ! నామాటవినుము. పోయి నన్ను ఇచ్చెదనని చెప్పుము. అదినాకు చాల ఇష్టము. ఆమునినే వరించితిని. ఆలస్యము చేయక పొమ్ము'' అని బోధించి లోపాముద్ర తండ్రినిఁ బంపెను.

రాజు సభలోనికివచ్చెను. మునినిసమీపించిమ్రొక్కెను. ఆలస్యమునకు క్షమింపుమనెను. లోపాముద్రను మీకు భార్యగా నిచ్చితిననెను. సుకుమారిని ఎట్లు కాపాడుకొనెదవో నీదేభారమనెను. అంతలో మునిలేచి నిన్ను నీకూతురేకాపాడి నది. నన్నును ఆమెయే కాపాడఁ గలదు. విచారపడకుము. రాజా! పోయివచ్చెదను. నాభార్యను బంపుము అనెను.

లోపాముద్రి నగలను దీసివేసెను. బంగరు బట్టలను విడిచివేసెను. నారచీరఁ గట్టుకొనెను. కుంకుమతోఁ గల్యా ణపు బొట్టు పెట్టుకొనెను. రాగిచెంబును దీసికొనెను. వచ్చి అగస్త్యుని ప్రక్కను నిలువఁబడెను. మునికిఁ జాల సంతో షము కలిగినది. ఆమెకరమును గ్రహించెను. రాజును ఆశీర్వ దించెను. భార్యతో వెడలిపోయెను. ఆదంపతులు చాల కాలము కాశీపట్టణములో నుండిరి. పిమ్మట కాలినడకను దక్షిణ సముద్రపు ఒడ్డునకుఁజేరిరి. లోపాముద్రకు ఒకకొడుకు పుట్టెను. వానికి దృఢస్యుఁడనిఁ పేరు పెట్టిరి.

లోపాముద్రి చాల మహిమగలది. ఒకనాఁడు భర్త భార్యను బిలిచెను. "నేను త్రాఁగినన్ని పాలను నీవు తెచ్చి పెట్టఁ గలవా?" అని అడిగెను. ఆమెపతిపాదములను ధ్యానించెను. ఒక చిన్న చెంబులోఁ గొంచెము పాలుపోసి యిచ్చెను. అతఁడు ఎన్నిసారులు త్రాగినను ఆపాలు తఱుగలేదు. మొదట పోసినన్ని ఆ చెంబులో నిలుచుచునే యుండెను.

ఆమె మహాత్త్వమునకు ముని చాలమెచ్చుకొనెను. పతివ్రతలు చేయలేని పనులు లేవని అతఁడు చెప్పెను.

విపులుఁడను మునియు, విపులాంగియనుముని భార్యయు అగస్త్యుని ఆశ్రమమునకు వచ్చిరి. లోపాముద్రి వారినిఁ దన యింట మూఁడుదినము లుంచుకొనెను. వారికి సంతుష్టిగా భోజనములు పెట్టెను. విపులాంగికి ఆశ్రమవిశేషములను జూపించెను. ఆమె చాల సంతోషించినది. మూఁడవదినమున విపులాంగియు, లోపాముద్రియుఁ బూలతోఁటలోఁ గూర్చుండిరి. విపులాంగి ఆమెవంక ఎగాదిగా చూచెను. లోపాముద్ర నవ్వుచు ఊరకుండెను.

విపులాంగి మఱల చూచెను. "ఏమి చూచుచున్నా వని'' లోపాముద్రి అడిగెను. "అమ్మా ఏమియులేదు. నీవు రాజకూఁతురవు. నగలు లేవేమని చూచు చున్నా"ననెను. "లేకేమి ? నాభర్తయే యిచ్చినారు. అవిగో ! ఆ చెట్టునకుఁ దగిలించి యున్నవి. నీకెన్ని కావలయునో తీసికొనుము'' అనెను. ఆమె చెట్టువంక చూచెను. అన్నియు నగలే. ఇది ఆమె మహాత్త్వమని తెలిసి కొనెను. పిమ్మట ఆ దంపతులు వెడలిపోయిరి.

---

*

# 9. అనసూయ.

కర్దముఁడను మునికి అనసూయ అను కూఁతురుండెను. అతఁడామెను అత్రిమహామునికిచ్చి పెండ్లిచేసెను. అత్రిమహాముని చాలఁ గొప్పవాఁడు. ఆయన భార్యయగు అనసూయ మహాపతివ్రత. ఆమెకు ఎప్పుడును మగని స్మరించుటయే ముఖ్యమగు పని. ఆమెకు ఎవ్వరియందును అసూయలేదు. అందువలన ఆమెకు అనసూయ అను పేరుపెట్టిరి.

ఒకనాఁడు నారదముని కొన్ని ఇనుప సెనగలను దెచ్చి పార్వతియొద్దకుఁబోయి ఆ సెనగలను మెత్తఁగా గుగ్గిళ్లుచేసి



పెట్టుమని అడిగెను. ఆమె నవ్వి తనవల్ల కాదనెను. లక్ష్మి

యును, సరస్వతియును అట్లే చెప్పిరి. చివఱకు అనసూయ దగ్గఱకు వచ్చి వేఁడికొనెను. ఆమె ఆ సెనగలను మెత్తగావండి యిచ్చెను. అవి ఒడిలోఁ బోసికొనిపోయెను. అనసూయ మహాత్మ్యమును లోకమంతటను వెల్లడించెను. పార్వతి, లక్ష్మి, సరస్వతులకు అసూయకలిగెను

వారు తమభర్తలగు ఈశ్వర, నారాయణ, బ్రహ్మలతో మొఱపెట్టుకొనిరి. అనసూయను వంచింపుఁడనికోరిరి. బ్రహ్మ విష్ణు మహేశ్వరులు వాహనములనెక్కి బయలుదేఱిరి. కొంత దూరము వచ్చుసరికి వాహనములు కదలలేక పోయెను. ఎందుచేతనని వారు వాహనముల నడిగిరి. "ఇది యొక మహాపతివ్రతయున్న ఆశ్రమము. మంటలు బ్రహ్మలోకము వఱకు వ్యాపించియున్నవి. అందువలన ముందునకుఁబోఁజాల కున్నాము" అని గరుత్మంతుఁడు చెప్పెను.

వారు ముగ్గురును వాహనములు దిగిరి. కాలినడకను ఆశ్రమమునకు వచ్చిరి. అచ్చట అత్రిమహాముని కనఁబడెను. అతఁడు త్రిమూర్తులకు నమస్కరించెను. వారినిఁబూజించెను. అతని సేవకుఁ ద్రిమూర్తులు తృప్తిఁబొందిరి. ముని వారిని భోజనమునకు నిలిపెను. నీభార్య చీరవిడచి వడ్డించునెడల భుజించెదమనిరి. ముని అందులకు ఒప్పుకొని, ఆసంగతి భార్యకుఁ జెప్పెను.

ఆమె చాల పదార్థములను రుచికరముగా వండెను. పిండివంటలతో సిద్ధముచేసెను. త్రిమూర్తులు భోజనమునకు వచ్చిరి. వారు దిసమొలతో వడ్డింపవలెనని ఆమెతోఁ జెప్పిరి. నన్ను వంచించుటకుఁ జెప్పుచున్న యెడల మీరు శిశువులగుదురు గాక యని పలికెను. వస్త్రము నూడఁదీసెను. ఆముగ్గురును పసిబాలురైరి. కెవ్వు కెవ్వు మని ఏడువసాఁగిరి. వారికి అన్నము తినిపించి తొట్లెలోఁ బరుండఁబెట్టెను.

పార్వతీ లక్ష్మీ సరస్వతు లెంత కాలము చూచినను తమ పతులు ఇండ్లకు రాలేదు. అందువలన వారు ముగ్గురు బయలుదేఱి అనసూయకడకు బోయి ఆమెను జూచిరి. "అమ్మా! మాభర్తలు సంచారమునకు బయలుదేఱిరి. వారెచ్చటనున్నదియు మాకుఁ దెలియలేదు. నీకుఁ దెలిసి యున్న యెడల చెప్పుము" అని వేఁడుకొనిరి.

మీ పతులు వచ్చినారు. నన్ను వంచింపఁ దలఁచి నారు. వారిని నేను శిశువులనుగాఁ జేసివైచితిని. ఆ మొదటి తొట్లెలో శంకరుఁడున్నాఁడు. రెండవతొట్లెలో నారాయణుఁ డున్నాఁడు. మూఁడవ తొట్లెలో బ్రహ్మయున్నాఁడు. మీరు తీసికొనిపొండు అని అనసూయ వారితోఁ జెప్పెను.

ఆ స్త్రీలు తమతమ భర్తలయొద్దకుఁ బోయిరి. తొట్లె లలోఁ జూచిరి. త్రిమూర్తులు కండ్లతో జూచుచే కాని నోటి

తో మాటాడఁ జాలరు. వారలకుఁ బసిపిల్లలకు మించిన జ్ఞానములేదు. వారిభార్యలు చాలవిచారమును బొందిరి.



ఏమియును చేయఁజాలకుండిరి. వారు మఱలవచ్చి తమ పతుల నెప్పటియట్లు ఒనర్పుమని అనసూయను ప్రార్థించిరి.

అనసూయాదేవి వచ్చి వారిపైన మంత్రోదకమును జల్లెను. వారు త్రిమూర్తులయినిలిచిరి. పార్వతి లక్ష్మి సరస్వతియు అనసూయను స్తోత్రముచేసిరి. బ్రహ్మ విష్ణు మహేశ్వ

గులు మాతప్పును క్షమింపుమని అనసూయను గోరిరి. నీయిష్టమువచ్చిన వరమును వేఁడుకొనుము. ఇచ్చెదము అనిరి. ఆమె "మీరు మువ్వురును నాకడుపున గొడుకులై పుట్టుఁడ" ని వేఁడెను.

ఆమెకుఁ దొలిచూలున బ్రహ్మ పుట్టెను. అతనికిఁ జంద్రుఁడనిపేరుపెట్టిరి. రెండవచూలున నారాయణుఁడు పుట్టెను. అతనికి దూర్వాసుఁడని పేరుపెట్టిరి. మూఁడవచూలున శంకరుఁడు పుట్టెను. అతనికి దత్తాత్రేయుఁడని నామమిడిరి. ఈ ముగ్గురు కొమరులును అత్రిముని వంశమును పవిత్రము చేసిరి. అనసూయకీర్తి లోకమున స్థిరముగా నిలిచియుండెను.

అనసూయ చాలమంది స్త్రీలకుఁ బతివ్రతా ధర్మములను బోధించెను. లోకము నుద్ధరించుటకు ఆమె చాల పాటుపడినది. ఆకాలములో ధర్మములను దెలిసికొని ప్రవర్తింపనెంచువారు చాలమంది యుండిరి. అందుచేతనే వారిపేరులు యుగములు గడిచినను స్మరింపఁబడుచున్నవి.

---

# 10. సుల్తానా రజియ.

ఢిల్లీ సింహాసనమెక్కిన మహమ్మదీయ చక్రవర్తులలో నాల్తమషు మూఁడవవాఁడు. ఈయనకు రుక్నుఉద్దీన్-బహారాం అను కుమారులును రజియా యను కూఁతురును గలరు.

కుత్బుమష్ తరువాత రుక్నుఉద్దీన్ రాజయ్యెను. అతని ప్రవర్తన దూష్యమైనదగుటచేత సరదారులు వానిని సింహాసనమునుండి తొలఁగించి రజియాను సింహాసన మెక్కించిరి. స్త్రీ జనములలో ఢిల్లీ సింహాసన మెక్కినది యీమె యొకతెయే.

రజియా జగదేక సుందరి. యౌవనవతి. విద్య బాగుగా నేర్చుకొనెను. మంచి చురుకైన బుద్ధి చాతుర్యము గలది. ఈమె యంతఃకరణము పవిత్రమైనది. ఆమెదృష్టి యెప్పుడును న్యాయ్యమునందు వర్తించుచుండును. మహాశౌర్యము గలది. తలఁచిన కార్యమును నిర్వహించుటలో మిగుల చాతుర్యము గలది. కార్యదీక్షయందుఁ బెట్టినది పేరు.

ఈమె ప్రతిదినమును బురుష వేషమున రాజ సభ నలంకరించుచుండెను. తన రాజ్యములోను మతములోను బూర్వము నుండియు వచ్చుచున్న కొన్ని దురాచారములను నతి చతురముగఁ దొలఁగించి మంచి కట్టుబాట్లతోఁ బవర్తింపఁ జేసెను. ప్రతికార్యమును రజియా స్వయముగాఁ బరిశోధించి చేయుచుండెను. పరిపాలనకు సంబంధించిన చట్టములను సవరించి ప్రజల యోగ్యతావర్తనమున కనుకూలముగఁ జేసెను. ఈమె పరమతద్వేషము నొందక రాజ్యములోని యన్ని జాతుల ప్రజలను సమదృష్టితోఁ బరిపాలించెను.

మోసగాఁడయిన యొకబానిసవాఁడు రజియాయొదుట మహాన్యాయవర్తనునివలె నటించి యామెను నమ్మించి కొన్ని యధికారములను బొందెను. అతఁడా యధికారములలోఁ గొంత ప్రజాపీడనముఁ గావించుచుండెను. వాఁడు సర్దారులను లెక్కసేయక పరోక్షమునఁ గార్యక్రమమునకు భంగములు గలిగించుచు వచ్చెను. సర్దార్లు వాని యధికారములను దొలఁగింపుమని రజియాను కోరిరి. వా రసూయచేఁ జెప్పుచున్నారని తలఁచి యామె యట్లు చేయలేదు. అందుచేత సర్దారులగు సామంతులు తిరుగఁబడి రజియాను చంపివేసిరి.

రజియా స్వయముగ మంచి ప్రవర్తనము గలది యయ్యును, దుష్టుని దరిజేర్చుటచేతఁ నామెకుఁ బ్రాణభంగము తటస్థించెను.